# పంచవటి

(ఖండ కావ్యము)

## శ్రీ మైథిలీ శరణ్ గుప్త



స్వేచ్ఛానువాదం

**జంగా సామ్రాజ్యలక్ష్మి**, బి.ఎ., ఎం.ఇ.డి.

శ్రీరామరక్ష సర్వజగద్రక్ష

# పంచవటి

హిందీ మూలం : శ్రీ మైథిలీ శరణ్ గుప్త

స్వేచ్ఛానువాదం

**జంగా సామ్రాజ్యలక్ష్మి**

ప్రధానోపాధ్యాయిని

జి.ప. బాలికోన్నత పాఠశాల

కోట

ప్రథమ ముద్రణ : జూన్ 1997

ప్రతులు : 1000

ప్రతులకు

లక్ష్మీకృష్ణ పబ్లికేషన్స్
2/242 నరసింగరావు పేట
గూడూరు, నెల్లూరు (జిల్లా). 542 101
ఫోన్ : 51187

ముఖచిత్రం :

పై తిరుపతయ్య
డ్రాయింగ్ మాస్టర్
చేజర్ల, నెల్లూరు జిల్లా.

మూల్యం : రు. 10-00

ముద్రణ : అశ్వనీ ప్రింటర్సు, తిరుపతి.

కంపోజింగ్ : శ్రీ సాయినాథ్ గ్రాఫిక్స్, తిరుపతి.

శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానం వారి ఆర్థిక సహాయంతో

ప్రచురితం



అంకితం

గోవిందేతి సదాస్నానం

గోవిందేతి సదా జపం

గోవిందేతి సదా ధ్యానం

సదా గోవింద కీర్తనం

శ్రీ వేంకటేశ్వర స్వామి దివ్యపాదారవిందములకు

భక్తి పూర్వకంగా సాష్టాంగ దండ ప్రణామములతో

సమర్పితం

**జంగా సామ్రాజ్య లక్ష్మి**

# జాతీయ కవి శ్రీ మైథిలి శరణ్ గుప్త

గంగోత్రి నుండి వెలువడిన చిన్ననది మార్గమధ్యంలో అనేక ఉప నదులను తనలో విలీనం చేసికొని పతితపావని గంగగా మారినట్లు మహావీర ప్రసాద్ ద్వివేది గారి 'సరస్వతి' పత్రిక ద్వారా పరిచయమైన సాధారణ వ్యక్తి తన రచనల ద్వారా పాఠకులకు పరిచయమై అఖండ కీర్తి నార్జించి అమరులైనారు.

హిందీ సాహిత్యాకాశంలో ధృవతారగా వెలుగులను విరజిమ్ముచున్న గుప్త గారిని గూర్చి వ్రాయడం సూర్యుని కోసం దీపంచూపడమే అవుతుంది. ఉత్తరప్రదేశ్‌లోని ఝాన్సీ జిల్లా లోని చిరగావ్ లో **1886** సం॥ ఆగస్టు 3వ తేదీన రామభక్తులైన రామచరణ్ దాస్ దంపతులకు నోముల పంటగా జన్మించారు. తండ్రి వారసత్వంగా రామభక్తి సంక్రమించింది. ద్వివేది, మున్షీ అజ్మీర్‌ల ప్రేరణ ప్రోత్సాహాలతో కలంపట్టి భగవద్భక్తి, దేశప్రేమ, అస్పృశ్యతా నిర్మూలన, హిందూ ముస్లిం ఐక్యత మున్నగు వివిధ సంఘ సంస్కరణ లకు సంబంధించిన విషయాలపై రచనలు చేసి ప్రఖ్యాతులైయ్యారు. వీరి రచనలలో అధునికత పట్ల అభిమానం ప్రాచీన సంప్రదాయలపై మక్కువ గోచరిస్తుంది.

శ్రీ గుప్త గారు జాతీయవాది. స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొని అనేక పర్యాయాలు జైలుకు వెళ్ళారు. సాహిత్యం ద్వారా దేశ ప్రేమను ప్రజలలో పెంపొందించడం కోసం 'భారత - భారతి' అను కావ్యాన్ని వ్రాసి ఆంగ్లేయుల కోపానికి గురియై జైలు పాలయ్యారు.

గుప్తగారి పేరు చెప్పగానే 'సాకేత్' మహాకావ్యమే స్ఫురణకు వస్తుంది. తులసీ రామాయణంలో కైక కళంకితగా చిత్రంచబడింది కానీ 'సాకేత్' లో పాఠకుల సానుభూతికి పాత్రురాలై మన్ననల పొందుతుంది. అలాగే 'యశోధర' కావ్యంలో 'యశోధరను' గుప్తగారు ఉదాత్తంగా చిత్రీకరించారు. ఇలాగే ఎందరో కావ్యోపేక్షిత స్త్రీపాత్రలకు పట్టాభిషేకం చేసి పాఠకుల ముందు నిలబెట్టిన కీర్తి వీరికి దక్కిందని నొక్కి వక్కాణించ వచ్చును.

ఈ 'పంచవటి' కావ్యాన్ని గూర్చి మాన్యులు శ్రీరాములు గారు చాలా చక్కగా వివరించారు. నేను మరల వ్రాయడం చర్విత చర్వణమే ఔతుంది. 'పంచవటి' లో మనోవైజ్ఞానికంగా సీతా, రామ లక్ష్మణుల పాత్రలను గుప్తగారు విశ్లేషించిన తీరు శ్రావ్యము, శ్లాఘనీయము, వర్ణనాతీతము, వాచామగోచరము. గుప్తగారి రచలను గూర్చి ఇలా చెప్పుకుంటూ పోతే ఎంత చెప్పినా తక్కువే అవుతుంది.

వీరు 'ఖడీబోలీ' హిందీలో తమ రచనలు సాగించారు. వీరి భాష సరళము, స్వచ్ఛమై సంస్కృత పద సమ్మిళితమైనను సాధారణ పాఠకులకు సులభ గ్రాహ్యంగా వుంటుంది. వీరు తమ రచనలలో చిత్ర, వర్ణనాత్మక ప్రగతి, సంబోధన, ఉద్బోధన యిలా అనేకశైలులను వివిధ ఛందస్సులను స్వంతం చేసుకొన్నారు. వీరు **1964** డిశంబరు **12**వ తేదిన పరమదించినప్పటికి వీరి కావ్య చంద్రికలు ఆచంద్రతారార్కం వెలుగులు విరజిమ్ముతూ సాహితీలోకానికి మార్గదర్శకం కాగలవు.

డా॥ఆచార్య మేడసాని మోహన్, M.A., P.hD.,
డైరెక్టరు అన్నమాచార్య ప్రాజెక్టు,
టి.టి.డి. తిరుపతి.




వాల్మీకి మహర్షి ప్రపంచ మానవజాతి కందించిన ఒక విజ్ఞానభాండారం శ్రీమద్రామాయణం. మహాపురుషుడైన శ్రీ రామచంద్రుడు, ఉత్తమ సాధ్వియైన సీతాదేవి, సత్యధర్మనిరతికి, భ్రాతృభక్తికి ప్రతీకాత్మకమూర్తియైన లక్ష్మణుడు .......... ఇలా ఏ ప్రాతను చూచినా, ఏసన్నివేశాన్ని పరిశీలించినా విశ్వమానవకల్యాణానికి దోహదం చేసే మనోజ్ఞ సందేశాలు గోచరిస్తాయి. మానవ జాతి మనుగడకు ఆవశ్యకమైన సార్వకాలిక ధర్మ సూత్రాలకు నిలయం శ్రీ మద్రామాయణం.

రామాయణసారాంశాన్ని '' పంచవటి'' ప్రతిబింబిస్తుంది. హిందీలో మైథిలీ శరణ్ గుప్తగారు రచించిన ఈ '' పంచవటి'' ని సామ్రాజ్యలక్ష్మి గారు సరళ సుందర భావానువాదంతో తెలుగు రసజ్ఞలోకానికి అందించారు. శ్రీ రామచంద్రుణ్ణి పెద్దలు మర్యాదాపురుషోత్తముడిగా ప్రశంసిస్తారు. రామరాజ్యంలో ప్రతి పౌరుడూ ప్రశాంతచిత్తుడు, ప్రసన్నముఖారవిందుడూనైన శ్రీ రామ చంద్రుణ్ణి సులభగమ్యుడుగానే ఆరాధిస్తారు. అందుకే ఆ మహాపురుషుని కథావిశేషానికి సంబంధించిన ఏ కవితా కలాఖండమైనా సారళ్యం ప్రధానంగా భాసిస్తూ ఉంటుంది.

సామ్రాజ్య లక్ష్మి గారు కూడా మూలంలోని భావప్రస్తారానికి, రసదీప్తికి భంగం కలుగకుండ, ఊహలపోహలింపులకు అనుకూలమైన పదబంధాలతో వర్ణనలతో, కథావ్యంజన స్ఫూర్తితో ఈ '' పంచవటి'' ని రచన చేశారు. ''సుందరసుధాంశుశ్వేతకిరణాలు'', '' ఉషోదయాన నవతుషార బిందువులు'', వంటి ఇంపైన, ప్రసన్నమైన సామాసికబంధాలు ఇందులో చాలా ఉన్నాయి. '' అన్న యున్న చోటనే అయోధ్యవెలయు ............ వంటి సందర్భాలలో భావాన్ని ఇంతకంటే ప్రసన్నంగా ఆవిష్కరించే అవకాశం ఉందా అన్నంతగా ఆనందం కలుగుతుంది. సామ్రాజ్యలక్ష్మి గారి ' పంచవటి' ని చదవడం ఒక కవితా రసలోకంలో విహరించడమే. ఈ కవయిత్రి ఇంకను ఇటువంటి ప్రసన్న సుందర కవితాజగత్తులు అనేకం సృష్టిస్తారని ఆశిద్దాం.

7-6-97 —మేడసాని మోహన్

గాదం శెట్టి శ్రీరాములు, M.A.,
రిటైర్డ్ లెక్చరర్
W4/205, బ్రాహ్మణ వీధి
గూడూరు - 524 101

# అభిమతం

భారత దేశ జాతీయ భాష హిందీ. అట్టి హిందీ భాష యందు జాతీయ కవిగా పాఠకుల మన్నలను పొందిన కవి శ్రీ మైథిలీ శరణ్ గుప్త. పుట్టింది ఉత్తర ప్రదేశ్ నందలి ఝాన్సీ జిల్లా యందు. స్వతంత్ర భారత పార్లమెంటు ఏర్పడింది మొదలు 1952 నుండి 1964 లో ఆయన పరమపదించినంత వరకు ఆయన నామినేటెడ్ M.P. గా కొనసాగారు. ఆయన రచించిన నలభైనాలుగు పద్యకావ్యల్లోనూ 'సాకేత్' మహా కావ్యంగా రూపొందగా 'పంచవటి' చక్కటి ఖండ కావ్యంగా ప్రసిద్ధి పొందింది.

శ్రీ మైథిలీ శరణ్ గుప్త గారు తన 'పంచవటి' కావ్యాన్ని ఎంత రమ్యంగా చిత్రించారో మాటల్లో చెప్పతరము గాదు. మనోహరమైన ప్రకృతి వర్ణనలు, నాటకీయత, శూర్పణఖ వాక్చాతుర్యము, సీతాదేవి స్వావలంబన, సౌందర్యవర్ణనలు, లక్ష్మణుని మనో విశ్లేషణ అధునిక ప్రజాస్వామ్య ప్రశస్తి వగైరాలు ఈ కావ్యంలో పాఠకుల మన్ననలు పొందుతాయి.

'పంచవటి' అనేది స్థానవిశేషం. ఇది రావి, మారేడు, మర్రి, కరక్కాయ, అశోక - ఈ ఐదు వృక్షాల సమాహారం. ఈ పంచవటి స్థానం పవిత్ర గోదావరి నదీ తీరాన ఆంధ్రప్రదేశ్ యందు గల దండకారణ్యం నందు ఉండడం నిజంగా ఆంధ్రుల అదృష్టం. ఇచ్చోటనే సీతా రామలక్ష్మణులు పర్ణశాల నిర్మించుకొని తమ వనవాస చివరి భాగాన్ని గడిపారు. ఈ పంచవటిలో జరిగిన సంఘటనతోనే రామాయణంలో విషాద ఘట్టం ప్రారంభమవుతుంది. శూర్పణఖ పరాభవం, సీతాపహరణం, రామరావణ యుద్ధానికి బీజారోపణ బంగారు జింక వేటతో బాటు మారీచ వధ వగైరాలు ఇక్కడే జరిగాయి. రాముడికి సీతావియోగం ఇక్కడే ప్రారంభమైంది. జటాయు వధ ఇచ్చటకు దగ్గరలోనే జరిగింది.

పంచవటి పర్ణశాల ప్రాంగణంలో లక్ష్మణుడు రాత్రంతా జాగరణ చేస్తాడు. వేకువ జామున క్షణ కాలం కళ్లు మూసుకొని తెరచే వరకు తన కళ్లెదుట అంత్యంత సౌందర్యంతో శూర్పణఖ చూచే వాళ్ల కళ్లు జిగేల్ మనేట్లు దర్శన మిస్తుంది. తననే వరించ వచ్చినట్లుగా తెలుసుకొని లక్ష్మణుడు గాబరా పడతాడు. తదుపరి తేరుకొని తాను వివాహితుడననీ, పాపము శమించుగాకయనీ విన్నవించుకుంటాడు. ఇంతలో సూర్యోదయం కావటం, ఉషాసుందరిలాగా పర్ణకుటీర ద్వారం తెరచుకొని సీతా దేవి బయటికి రావడం, ఆ తల్లి పవిత్ర సౌందర్యం ఎదుట శూర్పణఖ కృత్రిమ సౌందర్యం వెలవెల బోవడం, ఇంతలో రామదర్శనం కావడంతో శూర్పణఖ మనస్సు రామునిపై లగ్నం కావడం అందుకు సీతా దేవి అడ్డంకిని తొలగించుకోవడానికి శూర్పణఖ సీతా దేవిపైకి హూంకరించడం, ఆపైన ఆ మాయావికి తగిన శాస్తి చేయమని శ్రీరాముడు లక్ష్మణునికి సైగ చేయగా లక్ష్మణుడు శూర్పణఖ ముక్కు చెవులు కోయడం, శూర్పణఖ తన నిజరూపం ధరించి రోదిస్తూ పరుగెత్తి పోవడం ఇందలి వృత్తము.

ఈ పంచవటి కావ్యానికి శ్రీమతి జె. సామ్రాజ్య లక్ష్మి గారు చేసిన స్వేచ్ఛాను వాదం హృద్యంగా వున్నది. ఈ అనువాద కావ్యం పద్యరూపంలో వున్న గద్యమా అని అనిపించినా అనిపించవచ్చును. మూలకావ్యంలో వున్న నాటకీయ రమ్యత, వాక్చాతుర్యం, ప్రకృతి వర్ణన, అను ప్రాస అలంకార శోభ, అక్షర రమ్యత మొదలగు అంశాలకు చాలా వరకు ఈ అనువాదకులు న్యాయం చేకూర్చారు. వీరి అనువాద ప్రవృత్తి ప్రశంసనీయము. వీరి అనువాద భాష తెలుగు నుడికారంతో సరళంగా వున్నది.

ఇటువంటి ఈ పంచవటి కావ్యాన్ని ఆంధ్ర పాఠకులకు అందించిన శ్రీమతి జె. సామ్రాజ్య లక్ష్మి గారు నిజంగా ధన్యులు

గూడూరు

తె 6-6-97

గాదం శెట్టి శ్రీరాములు

రిటైర్డు హింది లెక్చరర్

# పంచవటి పవిత్రం

రామాయణ, భారత భాగవత మహాకావ్యాలు ఆనాటి భారతీయతత్వ జీవన దర్పణాలు. సజ్జనుల సంస్కారయుత మహా పాండిత్యానికి ప్రతీకలు. ఈ నాటికీ ఆ మహాగ్రంధాల పటిమ ఈ క్షణమాత్రం తగ్గలేదు. జనజీవాలతో వాటి ప్రత్యేకతలను చాటుకొంటూవున్నాయి. మానవబంధాలకు ఆదర్శప్రాయమయ్యాయి.

అయితే ఈ ఉద్గ్రంధాలు ఈ నాటికి వారికి అందుబాటులో లేవు. 'అందుబాటు' అంటే – తదను గుణమైన చదువులు చదివి, యధాతథంగా అర్థం చేసుకోగల వ్యక్తులు చాలా తక్కువ. అసలు అందుకు తగిన వ్యవధి కూడా నేడు లేదు. ఇవాళ అంతా ఇన్‌స్టాంట్. జీవనగమనంలో 'స్పీడ్' ఎక్కువైంది. రోజురోజుకీ మానవజీవితం యాంత్రికమై పోతోంది. మానవ బంధాల స్థానే వ్యాపార బంధాలు వేళ్ళూనుతున్నాయి.

ఇటువంటి దశలో యిలాంటి రచనలు సమాజాన్ని ప్రభావితం చేస్తాయి. చదివిన వారిని పునరాలోచింపచేస్తాయి. మానవత్వాన్ని మనిషిలో మేల్కొలుపుతాయి. పక్కదుగు వేసిన మనిషిని సరయిన దారిలో నడిచేటట్లు చేస్తాయి. అందుకే ఒక మాట--

మహాకావ్యాలన్నీ సంక్లిష్టత నుంచి సరళదశకు రూపాంతరం చెంది మామూలు మనిషికి అర్థమయ్యేలా అందుబాటులోకి రావాలి. అప్పుడే వాటి గొప్పతనాన్ని నేటి తరం తెలుసుకొనే వీలుంది. లేకపోతే అవి పెద్దపెద్ద అర్థం కాని గ్రంధాలుగా అద్దాల బీరువాల్లో, కలరా వుండల దయతో బంధింపబడి అలా అనామకంగా పడివుండాల్సి వస్తుంది. అంతటి గొప్ప గ్రంధాలను రేపటి తరం పూర్తిగా మరిచి పోయే ప్రమాదాన్ని విజ్ఞులు గుర్తించగలరు.

ఇప్పుడిప్పుడే ఈ రూపవిక్రియ ప్రక్రియ సజావుగా జరుగుతూవుంది. ఇది శుభపరిణామము. అలాంటి ప్రయత్నమే ఈ పుస్తకం 'పంచవటి'. రామాయణంలో 'పంచవటి' ప్రాశస్త్యం ఎరుగని సాహిత్య కోవిదులు వుండరు. పితృవాక్య పరిపాలనకు, భార్యాభర్తల అనురాగానికి, అన్నదమ్ముల అనుబంధానికి 'పంచవటి' ఒక సంకేతం. అటువంటి పవిత్ర భాగాన్ని హిందిలోంచి తెనుగులోకి అనువదించారు శ్రీమతి జంగా సామ్రాజ్య లక్ష్మి గారు. ఇది అనువాదం అనే కంటే అనుసృజన అనడం సముచితం.

సులభశైలిలో అలతి అలతి పదముల అల్లికతో పాఠకుల హృదయాలను హత్తుకునేలా ఈకృతిని రూపొందించిన ఆమె నేర్పుకు అభినందనలు. భర్త కృష్ణమూర్తి గారి సాహచర్యం, ప్రోత్సాహం అక్షర యజ్ఞంలో ఆమెకు ఎనలేని అండదండలు. ఈ కవయిత్రి హిందిలోంచి తెనుగులోకే కాదు, తెనుగు నుంచి హిందిలోకి కూడా అనుసృజన చేయగల విదుషీమణి.

'పంచవటి' అనే యీకృతిని ఆసాంతం ఆస్వాదించగలిగితే – క్రమేణా కనుమరుగవుతున్న మానవ బంధాలు, ధర్మాధర్మ విచక్షణలు మనకు దృగ్గోచరమవుతాయి. రామచరితం మనోహరం. అది రాసిన వారు, చదివిన వారు చరితార్థులు. శుభం–

ఉంటాను. జైహింద్

జయంపు కృష్ణ

నెల్లూరు – 524 001

డా॥ వి.బి: సాయికృష్ణయాచేంద్ర, M.A., PhD., సంస్థానం
మాజీ శాసనసభ్యులు వెంకటగిరి

మైధిలీ శరణ్ గుప్త విరచించిన 'సాకేత్' అనే మహా కావ్యం ఒక అమూల్యనిధి వారి ఖండకావ్యమైన 'పంచవటి' కి తెనుగు సేత ఈ కృతి. ఇది రసహృదయులకు బహుకృతి. హిందీ పండితురాలైన శ్రీమతి సామ్రాజ్య లక్ష్మి గారు దీనిని స్వేచ్ఛాఛందస్సుతో అందంగా మలచారు. రామాయణ కథను అనేకులు వ్రాసినా, ఎవరి అనుభూతులు వారివి. రామాయణం చెరకు గడ వంటిది. ఎక్కడ నమిలిచూచినా ఇక్షురసమే, మధు రసమయముగా వెలువడినది. 'సుందర కుటి' – పంచవటి' వంటి అందమైన అంత్యప్రాసా భాసురంగా రసరమ్యంగా ఈ కృతిరూపుదిద్దుకున్నది. ఈ రచనను సమర్థవంతగా నిర్వహించిన శ్రీమతి సామ్రాజ్య లక్ష్మి గారికి మనసార అభినందనలందిస్తున్నాను. ఇంతకు ముందు జయంపు కృష్ణ గారి 'జాతి గులాబి' ని రాష్ట్రీయ గులాబ్‌గ హిందీలోనికి రూపొందించారు.

వీరు మరిన్ని రసవత్కావ్యాలు వ్రాయాలని, మన సంస్కృతీ సంప్రదాయాలకు వన్నె చేకూర్చాలని ఆశిస్తున్నాను.

ఇట్లు

వెంకటగిరి సాయికృష్ణయాచేంద్ర

12-6-97

# పంచవటి పరమార్థం

" శ్రీరామ రామ రామేతి రమే రామే మనోరమే
సహస్ర నామ తత్తుల్యం రామనామ వరాననే".

మానవ జన్మకు చరితార్థత భగవదారాధనమే కదా! సంగీత సాహిత్యముల ద్వారా అన్నమయ్య, తాగయ్య, పోతన, రామదాసు మున్నగు వారెందరో మహనీయులు పరాత్పరుని సేవించి ధన్యులైరి. ఆ కోవకు చెందిన వారే మైథలీ శరణ్ గుప్త గారు. మన జాతీయ భాషలో జాతి గర్వించ దగిన జాతి రత్నముల వంటి రచనలందించిన జాతీయ కవి బిరుదాంకితులు. రామకథను హిందీలో తులసీ దాస్ తర్వాత సర్వాంగ సుందరంగా వ్రాసిన కీర్తి వీరికి దక్కిందనడంలో అతిశయోక్తి లేదు.

రామకథను ఎవరు పాడినా, విన్నా, ఎవరు చదివినా, వ్రాసినా ఎవరు జపించినా, స్మరించినా సర్వకాల సర్వావస్థలయందు భక్తి ముక్తి దాయకం, అది రమ్యాతిరమ్యం, దివ్యాతి దివ్యం, నవ్యాతినవ్యం, మధురాతి మధురం. " పంచవటి చిన్న ఖండ కావ్యం. రామాయణంలోని రాముని వనవాస సమయంలోని ఒక ఘట్టంను తీసుకొని రసవత్తరంగా మనోజ్ఞంగా మలిచిన అద్భుత శిల్పి గుప్తగారు హిందీలో ఈ ఖండ కావ్యానికి లభించిన కీర్తి ప్రతిష్ఠలు ఏ కావ్యానికి లభించలేదనుట వాస్తవం. ఈ కావ్యంలోని పాత్రలు దైవాంశ సంభూతులుగా కాక లౌకిక జగత్తులో కర్తవ్య పరాయణులైన పాత్రలుగా చిత్రీకరించారు. ఆదునిక భావ వ్యక్తీకరణతో అభినయాత్మక ధోరణిలో నున్న ఈ కావ్యాన్ని చదువుతున్నపుడు నాటకాన్ని చూస్తున్న అనుభూతి కలుగుతుంది. బిందువులో సింధువును నింపినట్లు అందమైన అతి చిన్న పదముల పొందికతో, ఆకర్షణీయమైన అంత్యాను ప్రాసలతో, సహజమైన ప్రకృతి వర్ణనలతో నన్ను పరవశురాలిని చేసినందున తెలుగులో ఈ కావ్యానికి శ్రీకారం చుట్టడం జరిగింది. పితృభక్తి, భ్రాతృభక్తి, సతీపతుల పరస్పర అవగాహనలే కాకుండ ప్రజాస్వామ్య భావాలు, బహువివాహ ఖండన, శ్రమలోని మహత్తు, భూతదయ, మున్నగు ఎన్నో విషయాలను గుప్తగారు ఆ రోజులలోనే వ్యక్తపరచారని తెలుపుటయే ఈ కావ్య ముఖ్యోద్దేశము.

# కృతజ్ఞతా సుమాంజలి

'' శివుని ఆజ్ఞ లేనిదే చీమైనా కుట్టదన్నట్లు'' నాలో ఈ సత్సంకల్ప ప్రేరణ గావించిన భగవాన్ శ్రీ సత్యసాయిబాబా వారి దివ్య పాదారవిందములకు నమోవాకము లర్పించుచున్నాను. నాకు హిందీ నేర్పిన గురువు శ్రీమతి పి. చెంచు రత్నమ్మ గారికి (నేషనల్ అవార్డుగ్రహీత, శ్రీకాళహస్తి). భక్తితో ప్రణామములు అర్పించుచున్నాను. తొలిసారిగ వేయు నా రచనా కార్యక్రమానికి చేయూత నిచ్చిన బహు రామాయణాలను ఔపోసన పట్టిన కోవిదులు మా బావగారు డా॥ జె.వి సుబ్బరాయుడు గార్కి (రిటైర్డ్ తెలుగు లెక్చరర్, జవహర్ భారతి, కావలి.) హృదయపూర్వక కృతజ్ఞతాంజలులు ఘటిస్తున్నాను. నా ఈ తొలి ప్రయత్నానికి తగు సలహాల నిచ్చి '' నన్నయ్య, తిక్కనలు వ్రాసినది కూడ అనువాదమే నమ్మా'' అని కొండంత అండగా నిలిచి నడక నేర్పించి కడవరకు నడిపించిన మహా మనీషి కవితా గంగోత్రి, సరస్వతీ పుత్ర, అష్టోత్తర సహస్రావధాన సార్వభౌములు ఆచార్య డా॥ మేడసాని మోహన్ గారికి నేను జన్మజన్మలకు కృతజ్ఞురాలిని. '' పుంభావ వాగ్దేవి శుంభత్కళాం భోది మేడసాని మోహన్ ధీవింభుండు.'' అని ఎందరో కవికోవిదులచే వేనోళ్ళ కొనియాడ బడుచున్న సద్గుణ ఖని, నా ఈ చిన్ని కావ్యమునకు అడుగగనే అంగీకరించి మున్నుడి వ్రాసిచ్చి కావ్యశోభను పెంచిరి. వారికి నా ధన్యవాదములు అర్పించుచూ వారి కుటుబమునకు దీర్ఘాయురారోగ్యైశ్వర్యములు ప్రసాదించమని శ్రీ వేంకటేశ్వరుని మనసార వేడుచున్నాను.

తులసీ రామాయణం, సాకేత రామాయణం, మున్నగు కావ్యములను తెనిగించి ధన్యజీవియైన శ్రీ గాదంశెట్టి శ్రీరాములు గారు (రిటైర్డ్ హిందీ లెక్చరర్, ఎస్.కె. ఆర్. గవర్నమెంటు కాలేజ్, గూడూరు) నాకు ఉత్సాహ-ప్రోత్సాహములు ఇచ్చినందులకు అభిమానంతో అభిమతము వ్రాసి ఇచ్చినందులకు సహృదయముతో నమస్సుమాంజలులు తెల్పుకొనుచున్నాను. వారి కుటుంబమును పరమాత్మ చల్లగా చూడాలని ప్రార్థిస్తున్నాను.

జాతీయ అవార్డు గ్రహీత, 'జాతి గులాబి' నవల సృష్టికర్త అయిన సోదరుడు జయంపు కృష్ణతో సహఉపాధ్యాయినిగా నున్న కాలములో నేను వారి నవలను హిందీలోనికి '' రాష్ట్రీయ గులాబ్ '' అను పేరుతో అనుసృజన చేయడం జరిగింది. అదే నాలోని రచనా వ్యాసంగానికి నాంది పలికింది. ఎన్నో రచనలు సాగిస్తూ అక్షర యజ్ఞానికి సమిధ అయిన కృష్ణ నా 'పంచవటి' పవిత్రతను ఇనుమడింప చేసినందులకు కృతజ్ఞతా పూర్వకముగ వారి కుటుంబమునకు ఆ శ్రీనివాసుని అనుగ్రహములుండాలని కోరుతూ ప్రణమిల్లుచున్నాను.

అడుగగనే తమ అభిప్రాయమును తెలిపిన సంగీత గేయధార ప్రయోక్త డా॥ వి. భాస్కరసాయి కృష్ణ యాచేంద్ర గారికి నానమస్సులు. వీరికి ఎల్ల వేళల శ్రీ సత్యసాయి బాబా వారి అనుగ్రహముండాలని కోరుకొనుచున్నాను.

దాదాపు నాలుగు సం॥ల క్రితం వ్రాసిన ఈ కావ్యం శ్రీ వేంకటేశ్వరుని అనుగ్రహ ప్రాప్తికై వేచివుండి, వారి అనుగ్రహం లభించుట నా పుణ్యఫలంగా భావించి శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానం యాజమాన్యం వారికి ఆర్థిక, హార్థిక సహకారము లందించినందుకు మరొకమారు కృతజ్ఞతతో ప్రాంజలి ఘటిస్తున్నాను. ఆ గోవిందుని కంకితమైన నా కృతి ధన్యమైనది.

పుస్తక ముద్రణలో సహాయసహకారముల నందించిన మా కుమార్తె, అల్లుడు చి॥ భారతి, శివరాంలకు ఆశీస్సులు, కృతజ్ఞతలు. ఆ శ్రీనివాసుల దయ వీరికిఎల్లవేళల ఉండాలని ప్రార్థిస్తున్నాను.

సకాలములో సర్వాంగ సుందరంగా ఈ కావ్యమును ముద్రించి ఇచ్చిన అశ్వనీ ప్రింటర్స్ అధినేత శ్రీ సి. వి. రావు గారికి నా ధన్యవాదములు

ఓం - తత్ - సత్

ఇట్లు
విధేయురాలు

గూడూరు

జంగా సామ్రాజ్య లక్ష్మి

జాతీయ అవార్డు గ్రహీత, 'జాతి గులాబి' నవల సృష్టికర్త అయిన సోదరుడు జయంపు కృష్ణతో సహఉపాధ్యాయునిగా నున్న కాలములో నేను వారి నవలను హిందీలోనికి ''రాష్ట్రీయ గులాబ్'' అను పేరుతో అనుసృజన చేయడం జరిగింది. అదే నాలోని రచనా వ్యాసంగానికి నాంది పలికింది. ఎన్నో రచనలు సాగిస్తూ అక్షర యజ్ఞానికి సమిధ అయిన కృష్ణ నా 'పంచవటి' పవిత్రతను ఇనుమడింప చేసినందులకు కృతజ్ఞతా పూర్యకవముగ వారి కుటుంబవమునకు ఆ శ్రీనివాసుని అనుగ్రహములుండాలని కోరుతూ ప్రణమిల్లుచున్నాను.

అడుగగనే తమ అభిప్రాయమును తెలిపిన సంగీత గేయధార ప్రయోక్త డా॥ వి. భాస్కరసాయి కృష్ణ యాచేంద్ర గారికి నానమస్సులు. వీరికి ఎల్ల వేళల శ్రీ సత్యసాయి బాబా వారి అనుగ్రహముండాలని కోరుకొనుచున్నాను.

దాదాపు నాలుగు సం॥ల క్రితం వ్రాసిన ఈ కావ్యం శ్రీ వేంకటేశ్వరుని అనుగ్రహ ప్రాప్తికై వేచివుండి, వారి అనుగ్రహం లభించుట నా పుణ్యఫలంగా భావించి శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానం యాజమాన్యం వారికి ఆర్థిక, హార్థిక సహకారము లందించినందుకు మరొకమారు కృతజ్ఞతతో ప్రాంజలి ఘటిస్తున్నాను. ఆ గోవిందుని కంకితమైన నా కృతి ధన్యమైనది.

పుస్తక ముద్రణలో సహాయసహకారముల నందించిన మా కుమార్తె, అల్లుడు చి॥ భారతి, శివరాంలకు ఆశీస్సులు, కృతజ్ఞతలు. ఆ శ్రీనివాసుల దయ వీరికివెల్లవేళల ఉండాలని ప్రార్థిస్తున్నాను.

సకాలములో సర్వాంగ సుందరంగా ఈ కావ్యమును ముద్రించి ఇచ్చిన అశ్వనీ ప్రింటర్స్ అధినేత శ్రీ సి. వి. రావు గారికి నా ధన్యవాదములు

ఓం - తత్ - సత్

ఇట్లు
విధేయురాలు

గూడూరు — జంగా సామ్రాజ్య లక్ష్మి

# భూమిక

1. పూజనీయుడైన పితరుని సత్యవాక్కు,
నిజభక్తితో శ్రీరాముడు నిల్పనెంచి
త్యజించె, సకల సుఖముల, వెడలె కానలకు,
నిజభక్తి ననుసరించె సీత, సొంపుమీర.
తమవెంట అరుదెంచు, తమ తమ్మునింగాంచి,
రామచంద్రుడు ప్రశ్నించె '' నీవెచటికి''ని ?
పాణిపల్లవములు మోడ్చి పలికె లక్ష్మణుండు-
''ప్రేమావతారులైన తమరి సన్నిధికే''.

2. ''జనకు నానతి తలదాల్చి అగ్రజుండు,
జనులు మెచ్చంగ, సర్వము వదలి కదిలె,
త్యాగివై, గృహమందు సతిని విడిచిరా
తగునే''? అని వగచె సీత మరిదితోడ.
''త్యాగి ననుమాట అనవలదు తల్లీ !
భోగినోదు భ్రాతృ చరణ సేవలో
భాగమిచ్చిన కంటికి రెప్ప నౌదును
భాగ్యమది చాలు నాకు'' నెను సౌమిత్రి

3. '' నీధర్మమిది యేనా సోదరా'' యనిన దాశరథికి,
' ధర్మప్రవృత్తి' యనుచు రామానుజుడు శిరసువంచి,
'' ప్రభూ! తమ ప్రజలు తమకై ఎప్పుడెప్పుడేయే
సద్ విధులాచరించిరని''? ప్రశ్నించె ప్రేమతోడ
'' నీవు సోదర వాత్సల్య భక్తిని చవిచూపి
నావు'' అనుచు అయోనిజ మందహాసించెనపుడు
నావుడు, రాఘవు నయన ద్వయంబు అరుణారుణ
కాంతులీను, కమలదళములై భాసిల్లెన్.

7. నిదురలో, ప్రాణికోటిమైమరచియుండగా,
వెదజల్లెను గగనలక్ష్మి ముత్తెములవంటి,
సుందర స్వచ్ఛ హిమబిందువులను, ధరణిపైన;
ఉదయముననే దినకరుడు వానిం గ్రహించి,
సదయహృదయ ప్రశాంతిదాయిని, విమల
సంధ్యాదేవి కొసగె, వానితో నామె,
రేరాణి నీలాంబరికి, స్వాగతము పలుక;
కొత్తకాంతితో నవి తారలై తళుకుమనెను.

8. సరసచరిత, ఆర్ద్రహృదయ, ప్రకృతిమాత
సరళ, తరళ, ధవళ తుషార బిందువులను
హసిస్తూ ఎంతహాయిగా వర్షిస్తున్నది !
సీతా రామలక్ష్మణుల తను అలరిస్తున్నది !
ఎరుగక చేసిన తప్పులకామె ఎవరికైన,
కరకుగా, శిక్షలు విధించుచుండు నందురు,
మరి వయోజనులను సతతము పసిపాపల వలె
ఔరా! లాలించి పాలించును కరుణమీరగ.

9. లక్ష్మణుడు మనమున యిట్లు తలపోయెసాగె-
పదమూడు సంవత్సరములు గడిచె గాని, అది
'నిన్న' 'మొన్న' నే జరిగెనా యన్నట్లున్నది
విధివశాన కానలకు మేమరుగుట గాంచి,
మదిచెదరగ, తపనపడుచు, తండ్రి తనువు విడిచె.
అప్పటి ఆగడ్డురోజులు గడచి పోయెనులే,
చప్పున వనవాసపు గడువు ముగిసిపోవునులే,
ఒప్పుగ నీ ప్రజలకింత భాగ్యమెచటలభించు ?
ఇప్పటి రామసేవ దొరకునే దొరలకైన !

10. అన్నరాజ్యపాలన, జనహితార్థమై-
మిన్నగా, ధర్మబద్ధముగ, చేయనెంచె.
లీనమై, రాజ్యవిధులలోన రామరాజ్యాన
మనలనందరి మరిపించి, మురిపించ తలచె !
లోకోపకారము చేయతలచినపుడు,
శోకము ఎప్పుడును, ఎవరికీ కలుగదు
లోకమున నరులు తమహితమునైన, తాము
చేసికో గల్గిరే ఒకింతయైన!

11. ''పినతల్లి కైక యేమని తలచె? తనయుడు
రాజ్యమేలునని, తాను రాజమాత నౌదునని
అన్నరాముని నిర్వాసితుగావించి, ఆమె
తనపీఠమును తిరముగ నిలుపదలంచె గదా!
కాని చిత్రకూటమున, నామెనుగాంచిన
పరిజనమంతా కరుణతో కలతచెందిరి,
వీక్షించుచుండిరి జనులందరామెనే;
కాని తననే ఆమె కాంచజాలదయ్యె''!

12. ఓహో! మాతృత్వ స్వార్థమిదా యనుచు,
సహోదరుడు భరతుడు త్యాగనిరతుడయ్యె
సహస్రాధిక సార్వభౌములకన్న మిన్నగా
మహోన్నతమైన చిరకీర్తి బడసె గదా!
మూఢమైన, గాఢ మాతృ-మమత
రాజ్యకాంక్ష కహో విలువనిచ్చి,
మమ్మడవి పాలుగావించె కాని,
మాకిచటనే సుఖశాంతు లమరె.

13. రాజ్యపాలన మాత్రమే రాజుల
ప్రధాన జీవన లక్ష్యముకాగా,
రాజ్యము వీడి ఆనాడెందులకు
నరేంద్రులు అడవులకరిగెడివారు ?
పరివర్తనయే ప్రగతి యైనచో,
పరికించి, ముందుకు సాగవలెనులే
నాకు నిజధర్మపథములే, సదా
సనాతనములైనను సమ్మతములే.

14. అన్నవున్నచోటనే అయోధ్యవెలయు;
ఎన్నతరమా వారి రాజ్యపాలనంబు;
తాను వనచరులను, కన్నబిడ్డలవలె
ప్రేమతో పాలించుచు స్వేచ్ఛనిచ్చె.
పురమున పంజరములోన పక్షుల
నిర్దయతో బంధించి, పెంచినాము.
వదినెతోడ నేడా విహంగములే,
విహరించసాగె నిరంతరము హాయిగా

15. పతితులను పలుమారు పశువులతో
పోల్చదగునే ? అదనుచితము గదా
మెకములెపుడును తమ విధులను మరువవు
ఏమరక చేయుచు, మసలుచుండును.
మానవత్వమును నేను భావింతు,
దైవత్వముగ, ఘనముగ సన్నుతింతు;
కాని పతితులనెపుడు పశువులని నే
ననను; పరులనగా విని సహింపజాల

16. అంచెలంచెలుగ పశుపక్షులు రాసాగనారా!
కొంచెము సేపిచట విశ్రాంతినందగోరి,
పంచవటి పాదపముల నీడన వదినె మక్కువ
గ, పంచసాగె వాటికాహారమును విరివిగాను.
చలాకి కొంటెపిల్లలు కొందరు కలిసికొని,
తల్లిని చుట్టి, విసిగించి, కోపము తెప్పించినట్లు,
పిల్లపక్షులు గుంపులై మాత జానకిని చేరి,
జిలిబిలి అరపుల సంతసింపచేసె సొంపుగ.

17. ఘన గోదావరి నదీ తీరమిది,
జలతరంగముల గలగలలు,
రాగాలాపన చేయుచున్నట్లు,
తాళము వేయు చున్నట్లు తోచె.
హరితపత్రములు హాయిగా నాట్యమాడ,
సరసతతో మనస్సుమాలు గుభాళింప,
విరిసిన వెన్నెలలో తారలు, చంద్రుడు
పరవశించి, విహరించు చున్నట్లు తోచె.

18. విహంగములు, వైతాళికులై కీర్తించుచుండ,
విదేహనందన ధ్యాన మగ్నయైయుండగా,
వినూత్నముగ గానరచన గావించుటలోనవి
సుకవికుల శ్రేష్ఠుల నధిగమించురీతి నుండె.
నడుమ నడుమ మయూరములు నాట్యమాడుచుండె,
చూడ, చూడంగ, నవి యిట్లు చెప్పుచున్నట్లు
తోచె '' నేడు మేము సిద్ధము, చూచెదము
రేపు మా తోటి పోటి కెవరు సిద్ధమో? ''

19. నేత్రముల యెదుట హరిత తరులు, విరులు
ప్రతిక్షణ మిచ్చుట ప్రమోదము గూర్చ,
కొండచరియలనంటి ప్రవహించుచు,
సెలయేళ్ళు చేసె, మృదంగ నాదములు.
ఉషోదయాన, నవతుషార బిందువులు స్వచ్ఛమైన
ముత్యములవోలె, మెరయుచు వనమునకు వన్నెతెచ్చె
నగరమున నివసించు నాగరికులకు ఎప్పుడైనా,
లభించునా ఇంతటి సహజమైన ప్రకృతిశోభ ?

20. తత్త్వజ్ఞానులందరు గూడి, ధృడ
చిత్తశుద్ధితో, సత్సంగములు సలుప,
శ్రోతలకు లభ్యమగు నిత్య-సత్యము
లైన నూతన నిరుపమాన వింతగాథలు.
ఇడుములు, ఎప్పుడెవరికి, ఎంతగ, గలిగిన,
వారి జీవిత సుమములు, వికసించిన తఱి,
అంతగనే, వారి గౌరవ సౌరభమ్ములు,
వెల్లి - విరిసి విస్తరించు, విరివిగాను.

21. చిలుకలు, గోరువంక లాశ్రమంబున ముచ్చటగ
వల్లించుచుండ వేదబుక్కులను, రామ యశో
గానము చేయసాగిరి మునికన్యలందరు గూడి,
'' ఏమని చెబుదు రాముని సత్యపరాక్రమములని''!
ఆహా! అగ్రజుని వనరాజ్యమున ప్రజలు
'ఓహో'! యనుచు సుఖజీవనులై యుండగా,
సింహ హరిణము లొకే తటమునందు, కలిసి
సహజవైరము వీడి త్రాగుచుండె నీరములను.

22. గుహ, నిషాద, శబరులను దాశరథి,
స్నేహ భావముతోడ పలకరించు,
సహకరించుచు సంతసము గూర్చుచు,
ఆత్మీయతతో ఆశిస్సులందించు !
సమాజము 'నీచు' అనును ఈ జానపదుల,
సామాజికులే కదా, వీరు సైతము
అమాయకులైనను మంచిమనసున్నది
వారెరుగరులే వక్రపుటాలోచనలు

23. కానలోన, మాకెన్నడును లేదు,
కాయగూరలవసరము, కందమూల
ఫలములు, నిర్మలజలములు, మధువు
ప్రకృతి సిద్ధమైన భోజనంబు.
మనసు సమ్మతింపవలె కాని వసియింప,
కుటీరమైననేమి ? భవనమైననేమి ?
జనకసుతకు వనమున సంతసము కలుగగ,
ఖేదమె మిగిలె, కైకమ్మకు రాజసౌధాన !

24. అయోనిజ తనఆరామమందు స్వయముగ
మొక్కల నాటుచుండు; నియమముతో మడులకు
నీరుపెట్టు; పుష్పఫల సమృద్ధమై, వన
మంత పెద్ద ముత్తైదువై గోచరింప,
గానే పొంగి పోవు నెంతగానో ఆమె.
ఎంతసుఖము ! ఎంత సంతోషము! కలుగును
భళిరే ! స్వార్జనలోన పొందు సుఖము ముందు,
కుబేరుని నిధికూడా తీసికట్టే కదా!

25. సంసార సాగరాన గోచరించు చుండు,
అంతము లేని నిరాశా- నిస్పృహలు కాని
అత్రి- అనసూయల ఆదర్శ దాంపత్య
జీవన మిందుకు భిన్నమై కానబడును!
ఈ వనము నగరముకన్న భిన్నమైన
నేమి ? కృత్రిమత కిచట తావులేదు;
ఇందు అధిష్ఠాన దేవత ప్రకృతియే;
ఏ వికృత చర్యల కిచట చోటు లేదు.

26. మాకు కలదు స్వజనుల చింత వారికి,
కూడా, మా ఆలోచన వుండవచ్చును;
అరణ్యావాసములో, నిచట మాకును,
వారికి ఉభయులకు ఒకే బాధ మిగిలె.
పరోక్షమున తనవారి ఖేదమును సహింతు
రందరు కాని ప్రేమను అందించలేరు;
ప్రత్యక్షమున ప్రకటించు ప్రేమయందే,
క్షేమము, సురక్షితమై యుండు నెపుడైనను.

27. వనములకొకసారి స్వజనుల
తోడ్కొనిరా, మనసాయె; నేను
అనుపమ ప్రకృతి మహిమలన్ని
వారికి చూపి తృప్తి చెందెద.
అచ్చెరువందెదరు వారార్యగాంచి,
స్వేచ్ఛగా సుఖసంతోషముల బడయుచు,
ముచ్చటగా ఇంటనున్న రీతి మనుచు,
ఇచ్ఛతో వన విహారముల లీనమై.

28. మనకు వెతలు సంభవించెనేని,
వానిని సహించు శక్తి సైతము,
మనకు గలుగుచుండు; విధివశాన
కష్టములే, సౌఖ్యములను భావన
దుఃఖముల మరిపింపజేయు; కాన
పురమును కరిగినను వనస్మృతులు
మధురస్మృతులై స్మృతిపథమందు
నిలచి మరువరాని అనుభూతినిచ్చు.

29. అకటా ! మాతల్లులెరుగరే!
మాకిచట సుఖశాంతులమరెనని,
లభించె హాయి కోమలమైన,
ఈ ప్రకృతి మాత ఒడిలోన
ఈ క్రీడనే అందురా ఏమిటి
'విద్యార్జన జీవన సంగ్రామమని' ?
కాని ఇందు యశస్సునార్జించుట
కుందేటి కొమ్ము సాధించుటయే కదా!

30. ఊర్మిళ మాకై ఆందోళన చెంది
ఓర్మి నశించి రోదిస్తున్నదేమో!
ఆమెకేమి తెలియు కాంతారమున,
మాకమితానందము లభించెనని,
అనుచు ఒకనిమిషము నిమీలిత నేత్రుడై,
కనులు తెరువగనే, కమనీయ రూపమున,
విచిత్ర వేషమున నిల్చిన కన్యగాంచి,
సౌమిత్రి చిత్తరువు వోలె నిల్చిపోయె!

31. వేయి మెరుపు తీగలొకసారి వెలిగి, కండ్లు మిరుమిట్లు
కొల్పినట్లు, ప్రచండ జ్యోతి జ్వాలలా ప్రజ్వరిల్లె;
సొగసుగా నిలిచెను అరమరిక లేని సోయగముగ
మధుర, మంజుల, మనోహర, సుందర, మంగళమూర్తి ఆమె!
రత్నాభరణ భరితమై, ఆమె తనూవల్లరి-
దగద్దగితమై వింతకాంతులీనసాగె, పుల్ల
కుసుమిత ద్రుమమందు వందలాదిగ మిణుగురులు
మినుకు మినుకు మని మెరయుచు వెల్గురీతి శోభిల్లె!

32. తృప్తిచెందని కామము అవధిదాటినట్లు,
ఆమె సుదీర్ఘనయనాలలో గోచరించె.
కమలములు మకరందపు మధురిమల రుచులను
జలజల కురియుచున్నట్లు భాసిల్లెనుగా
ఎవరి కొరకు వెదకి, వెదకి వేసారెనో
చిట్ట చివరకు వారి దరి జేరగల్గెను.
దారి తప్పిన భీతహరిణి, తుట్టతుదకు
తన పొదరింటిని తానే చేరినట్లుగ

33. కటిదాటి, వ్రేలాడు బారైన శిరోజములలో,
ఆమె వామహస్తము చిక్కి కదులుతీరుచూడగా,
అరుణ కమలము, కోమలముగ ప్రియమారగ అలరుచు,
భ్రమరములతో కమనీయముగ క్రీడించురీతి తోచె.
దక్షిణ కరమున సుగంధ భరితమై,
వ్రేలాడు విరులమాల, కల్పవృక్ష
శాఖకు ధనువు వ్రేలాడ దీసి,
వేసిన స్మర విరచిత ఊయలేమో!

34. కాని రామానుజుని మానసము,
సందేహడోలలో ఊగుచూ,
భావనల వలయంలో భ్రమిస్తూ;
తనను తానే విస్మరించె.
ఆలోచనా చక్రమున చిక్కి,
భ్రమించుచు, అంతము కానకుండె
సముఖమున సుమసుందరిని గాంచి
ఇది 'దివా స్వప్నమా' యని తలచె

35. లక్ష్మణుని రూపలావణ్యము గాంచి-
విస్మయమంది, దరహాస వదన
" శూరడవయ్యు సుందరిని కాంచగనే
చకితుడైతివేల ? చంచలుండవై,
సహజ సిద్ధమైన, సృష్టిస్వభావమున,
ఏమున్నది నా ఆనన సీమలో !
కలవరపడి కలత జెందితివదేల ?
మూగనోము విడిచి నన్నందుకొనుము.

36. ప్రమదనయ్యును, ప్రథమమున భాషింప
వలసివచ్చె, విషయమేమని నీవడుగ
వైతి; పురుషాహంకార కాఠిన్యములు
వెల్లడియాయె తేట తెల్లము గాను.
అంతట రామానుజుడు మొదట
తెప్పరిల్లె, పిదప చిరునగవు
చిందించె, పెదవి విప్పపలికె,
బదులుగ గంభీర వదనుడై

37. " సుందరీ! హఠాత్తుగా నిన్నిట గని,
నివ్వెరపోయితి, నిక్కముగను,
నిశీథసమయము, ఒంటరి వనితవు,
నీవెవ్వరవు ? బయలు దేరితివెచటకు ?
అబలనని అమాయకురాలివై ,
పలుకుచుంటివి, ప్రగల్భమ్ములు,
విరక్తుడై మమత లేని నరుని
యందు, గనుచుంటిని కాఠిన్యమ్మును!

38. కాని నేనే, పరనారితో,
మొదలు సంభాషించినచో
పురుష ధర్మపరాయణతకు
భంగము తప్పక వాటిల్లునుకదా!
ఏదేమైన గాని, నన్ను గూర్చి
నీవనుకున్నదే నిజము; చండీ !
ఏమని చెబుదు, నీవనిన నాకు
మమత లేదు లేశమాత్రమైనను.

39. మాత, పితలు మరియు సతియు, ధనకనక
వస్తు-వాహనములన్న, ప్రీతిలేదు.
జీవన సంప్రదాయముల భ్రాంతి లేదు,
ఏదన్నా లేశమైన కాంక్షలేదు.
వేయి మాటలేల ? నేను స్వార్థ
చింతన లేని, పరమ సౌఖ్యుడను
ఓసుందరీ ! మమత లెప్పుడును,
మెదలుచుండు మహిళల మదియందే".

40\. 'వీరుడ'నని నీవు పిలుచు తీరుచూడ,
'భీరువ' ని చెప్పకనే చెబుతున్నది;
చురుకైన నీ కుశాగ్రబుద్ధి కూడ,
ఎరుగగలరు ఎంత వారైన గాని !
నీవు మాటలాడు తీరుగాంచ
నాకు గుండెలదిరె, భీతి గలిగె
లలనా! నిన్ను ఈ వనమున తిలకించి
సందియముతోమది కలత జెందె.

41\. నిన్ను ' మానవ మగువ' యని పిలుతమన్న
సున్న నీలో సుదతి సహజ లక్షణములు,
పోని, దానవి యని యనుటకు అన్నుల-
మిన్న వలె అలరు నీ లావణ్య శోభ
వన దేవత యని భావింతమన్న,
కానరాదు అమాయకతయించుకైన,
వినిపింపుము నిజము నీవెవ్వతివో
ఓనిగూఢ, నిశీథ మంజుముఖీ!

42\. '' నీవెవ్వరని మాత్ర మడిగతివి'' గాని,
'కావలె నీకేమని' ప్రశ్నింపలేని-
' ఓనిష్ఠాగరిష్ఠ యువ శ్రేష్ఠుడా!
నా మనంబెట్లు శాంతించు ? నకటా!
తెలియగవచ్చె తేటతెల్లముగ నీవల్ల
మోసపోదునని; కాని నేనింత దూరము
వచ్చినదాన, ఆరునూరైనా, ఎరుగుము
రిక్తహస్తనై కదలుట కల్లయని''.

43. నీ అతిథిగా నన్నుతలచి
మిన్నగా యిత్తువనుకొంటి
ఆతిథ్యము; శిలలు కరుగును
గాని, నీగుండె కరగదేమి ?
అనుచుబాధాతప్తయైన,
ఆ మానినిగాంచి లక్ష్మణుడు
మొదట మెల్లగ హసించెపిదప

44. ''ఓశుభాంగీ! మాయామానుష రూపిణీ!
నీవతులిత ఐశ్వర్యవతివి,
నేనావట్టి దరిద్ర దామోదరుడ,
వనవాసిని, సిగ్గిలుచుంటిని,
నీ కాతిథ్యమొసగలేక'' అనెను.
అదివిని రమణి రమ్యముగ ననె-
''అవగతంబయ్యె నీ అంతరంగము
విధి నీకొసగిన సిరిసంపదలు
ఒసగలేదు కదా దేవతలకునైన!

45. విరాగభావముతో, నిజముగా
నీవు త్యాగశీలివైనచో,
ఈ రత్నాభరణములు నీకై
పరిత్యజింతు పరాయణతతో!
నరవరా ! నేను సైతము నీవలె యోగినౌదు,
మీరిన భోగలాలసత, వలన దరిజేరి
దాపురించిన ఈ విపుల - విఘ్న-విపత్తులను
వారింప తరమగునే ఏ విరాగికైన!.''

46. ఏకాంక్షతో నీవీవ్రత మొనర్చు చుంటివో,
ఏమాకాంక్షించి నియమ బద్ధుడవైతివో,
ఆంక్షలు లేవు నాకు నీకాంక్ష తీర్చగలను;
ఉపేక్షించక నీ అపేక్ష తెల్పవయ్యా,
అక్షయమైన సిరులపై మోజు కలిగనేని,
లక్షణయుత నిధినిక్షేపముల నిత్తు; రాజ్య-
కాంక్ష కలుగుచో, పాలింప సామ్రాజ్యమిత్తు;
ఆక్షేపించదగు వైరాగ్యము వీడుమయ్య.

47. అజేయుడగు ఏ శత్రువుపైనైన,
విజయము సాధించి బదులు తీర్చదల
చిన ఆనతిమ్ము - ఆహుతికావింతు,
నిజకాలానల క్రోధాగ్ని తోడ;
ఏ తరుణి ప్రేమ పిపాసతోనైన,
ఈతపోకూపము త్రవ్వుచుంటివేని,
చిక్కబట్టి, మదినెందులకు హింసింతువు ?
నిక్కముగా నీవమాయకుడవే సుమా!

48. ఈయవ్వన, ధనప్రాణముల
మీద ఎవ్వరు దెబ్బతీయరు ?
నీవు వీటిని 'అడవినకాచిన
వెన్నెల' చేయక దక్కించుకొమ్ము.
ఓయువకా! జీవితము భారమై?
ఎందులకైన, విసుగు జనించుచో,
నీతో జీవించు అవకాశమిమ్ము;
దానశీలివై, దయను చాటుకొమ్ము

49. అని ముగించిన పిదప ఊర్మిళావిభుడు
'' ధన్యవాదములు నీకు ధన్యురాలా!
వనరాణీ! నిశ్చయముగ నీలో స్త్రీ
సహజ కరుణ కలదనెను గంభీరముగ
అకటా! సామాన్య కన్య ఎచటనైన,
ఇట్టి ప్రస్తావన చేయునే ? పురుషునెదుట;
వట్టి కబురులు కావు వాస్తవమిది భువి
యందు నాకేటి లోటులేదనె'' సౌమిత్రి

50. అంతట నా మోహిని ''నిజముగ నీవీ
ప్రాయమున, నిష్కామ తపమాచరించు
చుంటివా? సుశీలుడవు గృహస్థ ధర్మము
వీడిన కలుషమంటును గదా నీకు?
తపమొనరించు చుంటివి కదా? తపః
ఫలము లభింప నేమి చేతువు ? స్వయం
ప్రాప్తమైన సుఫలము ననుభవింపవలె
గదా? అని రామానుజుని ప్రశ్నించెను.

51. వృక్షములు నాటు అభిరుచి,
కలుగు నెందరకు ? కాని
ఆతరువుల ఫలముల రుచిచూడ
కుందురే ? వారని మరల అనెనామె
ఫక్కున నవ్వి లక్ష్మణుడు పలికె ''సుందరీ!
ఎక్కువగా మాటాడకు నేను 'తాపసి'నని
మక్కువతో చాటితివి 'తాపసి' నన్న పదవి
చక్కగా నీవొసగితివి నేపొందితిగదా''!

52. తపోఫలమును ఊరకనే పొందినను
రుచిచూడ నాకు ఇచ్ఛలేదు నీవంటి
జనుల కొరకు భద్రపరతు సురక్షితముగ
దాని;నని పలికె ఊర్మిళా విభుండు.
కిలకిలమని ఆకలికి హసించి ఆ
ఫలము నేనే ఐనచో నేమి చేతువు ?
తెలుపుమనుచు ఈ అమూల్యావకాశము
నేనేల జారవిడుచు కుందునని పలికె

53. " నేను తగిన వ్యక్తిని వెదుకుదు,
గాని, ఈ పద్ధతి నాకు తగదు;
అను సౌమిత్రితో 'నేనాతని ఎన్ను
కుంటికాని నామ మెరుగనైతిని.
కలడాతడు నాసమక్షమున అని పడతి
పలికె, ఉలికె పడె, లక్ష్మణుడా పలుకు
లాలకించి " ఎవరు"? అన"నీవే" అనుచు
లలన సిగ్గుల మొగ్గయి మౌనము వహించె

54. "హరిహరీ! పాపము శమించుగాక
ఓబాలా! నేవివాహితుడను"!
అను రామానుజు నుడువు లాలకించి
"పురుషులకు ఇరువురు పత్నులుందురు"
కదా! అని ఈ రీతి సమాధానమిచ్చె -
"నరుడు శాస్త్ర రచన గావించునపుడు,
విరివిగా వనితకు విధించె కట్టుబాట్లు;
తనకనుకూలముగ, సుఖముల వ్రాసికొనె".

55. ‘‘నవ్యశాస్త్రరచన గావించి నారీమణులు
భువిలో బహుభర్తా విధాన మేర్పర్చ వచ్చు
కాని నరులే, నారీ సతీత్వ గౌరవములను
ఆదరించి ఆమె కీర్తి గానము చేతురు.
నామదిలో భావలహరులలో నొకవైపు
మొదలుచున్నవి శాస్త్రవిధులు; సద్భావన
గలదు నాకు సంప్రదాయము లన్న; సదావాని
గూర్చి యోచించు నామనసు నాదే సుమా!

56. ఏ భవ్యభావము గనినే
నభిమానింతునో అతివల;
పురుషులలో నదే భావము
నిక్షిప్తమైయుండ నభిలషింతు
బహుభార్యాలోలుడన్న పేరు నాకేల?
భద్రే! క్షమించుము నన్ను; వరింపుము
ఎవరినైన కృత కృత్యురాలివై;
అని పలికెను ఊర్మిళా విభుడామెతో.

57. ‘‘ కాని ఏచిత్తముతో ఎవరిని
వరింపను? నామది పరాజయ
మంది నీదయ్యెగదా’’ ‘‘చోరత్వ
మారోపించి నిందవేయబడె
గదా! నాపై ‘‘అసత్యమా’’ నే
చెప్పునదియని ఆ మగువ ప్రశ్నించె-
‘‘ అయ్యో! నాఅంతరంగము వశము
తప్పి నా చేయి దాటి వెళ్ళెనేయని
విలపింపసాగె వికలమనస్కుయై

58. కళానిధి తనకిరణజాలము
ప్రసరింప చేసె, గాన అతని
అందచందములకు స్పందించి,
చకోర మాకర్షింపబడెను.
దీపకాంతులకు ఆకర్షితయై
శలభమారాధనతో, అసువులబాసె
మృదంగవాద్యము మ్రోగించి వ్యాధుడు,
వశము గావించు కొనును హరిణముల

59. ఇంతస్ఫురద్రూపివైన నీవు
నన్నెందులకు, మోసగించితివి?
ప్రభాత భాను స్పర్శకు,
వికసించని కెందామర లుండునా?''
సులక్షణుడైన లక్ష్మణు డిట్లనె
''ఓవిలక్షణురాలా! ఆగుమక్కడ;!
సమీరునికి లోబడిన కేతనము భంగి
అటునిటు ఏల ఎగిరి రెపరెపలాడెదవు?

60. ఎవరి రూపలావణ్యము గనినీవు
వర్ణించుచు ఆనందించు చుంటివో
అతని గుణగణములు, వంశమర్యాదలు,
అవగతములా నీకనె'' ను రామానుజుడు.
''మానవా! నీవేల నామది నపహరించితివి ?
అకటా! ఏమి పలుకుచుంటివి ? అనుచు
మోహముతో ముకుళితాంగియై''
ఆకామిని యిట్లు పలుకసాగె-

61. "నీవ్యామోహమున బడి గమనించక
మాకుల మర్యాదలనే విస్మరించితి
నా ప్రేమికుడవైన నీ వంశమర్యాదల
తలంపులు నాకసలు రానేలేదు సుమా!
నడిరేయి గడుచుచున్నది
గడుసరీ! సరసోక్తులాడగ రమ్మ
కడకు ప్రేమభిక్షకై నీవాకిట నిల్చితి
నిండైన నీగుండె తెరచి స్వాగతమిమ్మ"

62. " ఓమోహినీ! ఎంత భ్రమజెందితివీవు
అందని మ్రానిపండ్ల కర్రులు చాచితివి;
మోహమే కాని ఇది నిర్మల ప్రేమకాదు
ఆత్మవిశ్వాసము కాదిది, ఆత్మద్రోహము;
విషముతో కూడిన కామమిది:
సుధాపూరితమైన, ప్రేమకాదు;
పద్ధతి కాదిది విరుద్ధము;
అవినీతియే, కాని నీతికాదు.

63. ఏదో అనూహ్యమైన మోసమునకు లోనై,
ఆత్మవంచన కొడిగట్టితివి నీవు; కాని
పెద్దతుపాను విసురుల తాకిడిని సద్దుచేయు
గవాక్షముల నుండి వంగి గాని, తొంగిగాని,
కాంచవలదు; భ్రాంతిని కలిగించు గాని,
మృగతృష్ణ శాంతి నొసగదు, పైపెచ్చు కల్గించు
విభ్రాంతిని; తస్మాత్! జాగ్రత్త! పరపురుషుడను
నేను భ్రాంతి భావనలను, వీడుమమ్మా!"

64. తూరుపున అరుణోదయమయినంతనే,
మారసాగె రంగులు ప్రకృతిలోన;
కిరణకంటకములు గ్రుచ్చుకొని, చిరిగిన
నీలాలనింగి నుండి ప్రభాత కాంతులు
విరిసె; పసిడిగన్నేరులపై కుంకుమపొడి
లా; 'పంచవటి' కుటీర ద్వారము
తెరచి రాజహంసవోలె నిలచిన
ఉవిద ఎవరహో ఉషః శ్రీ అగునేమో!

65. ఓహో! అంబరాన ప్రత్యూషమైన,
ఆహా! ఇంతటి శుచి స్ఫూర్తులు కలవా?
ఇహలోకమున నుండు ఉష సజీవమూర్తి,
ఊహామూర్తి దివిలోన ఊషాసుందరి.
ఆమె వదనము గాంచి, జాబిలి
వెలవెలబోయి పశ్చిమాద్రి
జేరె; లజ్జతో సౌమిత్రి మోమున
ఊహల అలలు కదలాడ సాగె.

66. కుముద పుష్పము వోలె, వంగినిల్చిన
పునీతమైన సీతను తటాలున
ఎదురుగా గాంచిన, ఆ వన్నెలాడి
బెదిరి పడెను మది కలతజెందగా
ఉషఃకాంతులలుముకొనుట ఒక
వైపు; గగనమున గాంచె, నా ఇంతి;
మరొకవైపు సుదతి సీత శోభను
నిరాడంబరతను గని, నివ్వెరపోయె!

67. ఆ తరుణి తన తనువు వైపు ఒక
సారి పరిశీలించి చూచుకొనె, అది
ఆభరణముల మధ్య చిక్కుకొని
అస్తవ్యస్తముగ, భారముగనుండె
మరల నొకసారి జానకిని వీక్షించె;
సరసిజాక్షి వంకలేని నిండుజాబిలి
వోలె, తారలు వేకువన వెలిగెడు రీతి
శోభిల్లు చుండె సౌభాగ్య చిహ్నములతో॥

68. మహత్తర చిత్ర మొకటి గాంచి
నట్లు సుమములు నవ్వసాగెను.
సుచరిత జనకజ చిరునగవు గని
విచ్చె; విడిమొగ్గలు విరివిగాను
మచ్చికతో కుసుమములెన్ని రాలెనోయని
పచ్చికయందు పవనుడు లెక్కింపసాగె;
ముచ్చటగా మధుపములు ఝుంకారముతో
వచ్చె క్రమముగా ఒకదాని వెంటనొకటి.

70. నాటకములోని ~~ఈ~~ నూతన దృశ్యమున
పక్షులగుంపులే ప్రేక్షకులై చూడసాగె,
వృక్షశాఖలపై నవి నధివసించి భ్రమర
ములతో గూడి రసాస్వాదన గావించి
నాటక మారంభింపుమని తొందర
పెట్టసాగె; విహంగములు కలరవము
సేయుచూ; 'పంచవటి' రంగస్థలమును
ప్రేమభావమ్ముల తోనింపసాగె

70. వైదేహి వీక్షించె మొదట ఆకన్నెను
పిదప రామానుజుని గాంచెనామె
తదుపరి ఉభయులను తిలకించి
మందస్మిత సుందర వదనారవిందమై
'' నీవెంత దయారహితుడవు? గృహమున
కేతెంచిన లక్ష్మికి ప్రాణముల కన్న
మిన్నగా నిను వరించి వచ్చిన కన్యకు
నీవు పరపురుషుడవా ? అనె మరిదితోడ

71. యాచకుని నిరాశ పరచుటలో
వ్యక్తమగును మానవ సంస్కృతి
కాని ఈ రమణి నీ ఆశ్రయము
కోరి అరుదెంచిన అబల కాదు
నీ కర్పణసేయ వచ్చె తన
సర్వస్వము నిస్పందియముగ
ఇచ్చలేనిచో నీమనసిచ్చుట
పుచ్చుకొనుట కేల సంశయంబు ?

72. స్నిగ్ధ, సుకుమారి చరణారవిందములకు
సాష్టాంగదండ ప్రణామంబుగావించె
సౌమిత్రి; అంతనామె'' నీ కార్యంబు లన్నియు
సఫలమగుగాక''! యని నిండుగ ఆశీర్వదించె
మొదట నీవు మీ సంభాషణ నే
నాలకించలేదని గ్రహించవలయు
ఈ శుక రంభా సంవాదమెప్పటి
నుండి సాగుచున్నదని ప్రశ్నించె మరిదిని.

73. స్మితవదనయ్యై రామప్రియ సంతసమున
ఆబాలతో''విలపింపకు సోదరీ''
అంతేలే! నామరిది స్వభావము; నీవు
వ్యధచెంద వలదని ఆ వధువుతో పలికె.
ప్రాణమిచ్చు సతిని వదిలి వచ్చె
నితడు, కాంతారములబడి మా వెంట;
ఏమని చెబుదు ఈ ప్రాయముననే
ఇతనికీ వైరాగ్య మేల కల్గెనో!

74. మెచ్చినచో చెప్పుము అరమరిక లేక
నచ్చిన ఎడల వెరపెందులకు ? అతని
కి నేనచ్చు చెప్పెద; నీవు భీతివీడి,
ఇచ్చటనే వుండుము; సుఖముగ;
నీఇచ్ఛకు తగిన రీతి వరుని చేతు,
అచ్చముగ నీవు శ్రీమంతురాలివే !
మేమా దరిద్రులైన వనవాసులము!
మేమే పాలకులము; మేమే సేవకులము!

75. పనిపాటలన్నియు మేమే చేతుము;
నీవేమియూ చేయవలదు; నీమృదు
కరములతో, పర్యవేక్షణనైనను
చేయనివ్వను నేను; కాని ఏనాడైనా,
నాపెంపుడు పశుపక్షులు ఇబ్బంది
కల్గించెనేని నీకు; ముందుగానే
చెప్పుచుంటిని, వినుము; క్షమించవలసి
యుండునని పలికె, భూమిసుత ఆమెతో

76. ‘‘ ఓదేవీ! ముందు నీ మరదలిగా,
చేసికొనుము; నాదేహము నందలి
అణువులన్నియు నీ సేవకంకిత
మగునని’’ పలికె నాపడతి జానకితో!
‘‘వనమున నీ వంటి నెచ్చెలి
నాకు తోడు లభించినచో
ఇష్టా-గోష్టి జరుపుచు వెళ్ళ
బుత్తుకాలము నని సీత ఆమెతో.

77. ‘‘స్త్రీ సహజకరుణ కలిగె, వదినెకీ తరుణి
యందు; కాని నాభావములామెకెరుకయే’’
నను సంగతి తలచి లక్ష్మణుడు లోలోన
సంతసించి మొగము ప్రక్కకు తిప్పి పలికె-
‘‘ ఈ సంభాషణ నాకేటికి ?
రవంత యేని ఈ వినోదమున
మోదము కలుగుటలేదని’’ పలికి
రామానుజుడు మౌనము వహించె

78. ‘‘ సోదర వాత్సల్యము కలిగిన
నీ మీద నాకేల యుండును కినుక ?
నే చేయుచుంటినా వినోదము’’
అనియె అయోనిజ మరిదితోడ
‘‘ విరహిణి ఊర్మిళ నాకొరకై
నిరంతరము రోదించు చుండు
నని తలచుచు పడుచుంటివా ? చింత’’!
అని ఓదార్చె జానకిరామానుజుని.

79. " నాఅనుంగు సోదరి ఊర్మిళ, దోషిగ
ఎంచదు నిన్ను; కాని రవంత వినుము,
నా ప్రస్తావనము; నీవు సుఖముగ నున్న
ఎరిగి సంతసించును తానుగూడ!
ముగుదలు ప్రియుని ప్రేమింతురు, మగని
అనురాగమున ముదమందెదరు, వారే
తమ సర్వస్వంబని భావింతురు; అంతియే
కాదు వారినే సదా మదిధ్యానింతురు.

80. వరించి వచ్చిన ఈ ఎలనాగ
కరమున వరమాల సహితముగ
కూర్మితో నీకు తనువు, మనసు
సర్వమర్పింపగ తరలివచ్చె
లలనా సహజయుత లజ్జను వీడి
'పెళ్ళి' ప్రస్తావన చేసెకదా
మరి నీవేభావమున ఆమెతో
తిరస్కారముగ వ్యవహరించితి వనె ?

81. అని భూజాత పలుక దరహసించి
" అకటా! నాకీమెపై మనసైననేకదా?
ఆమెతో సరససల్లాపము లాడుటకు ?ః
అని వాక్కుచ్చె ఊర్మిళా విభుడు
" శుభము కల్గుగాక!" అని దీవించె జానకి
కుటిలోపల నిదురించు పతిని పిలుచుచూ
" ఆర్యా! ఆలకించితిరా, అనుజు పలుకులు-
అనుచు పర్ణకుటి వైపు దృష్టి సారించె

82. '' లెమ్మ! ఆర్యపుత్రా! కనులారగనుము,
రమ్మ, సుప్రభాతమున ద్వారము వద్ద,
సిద్ధముగ వచ్చి నిలువబడె, అనుజ వధువు,
అలంకృతయై; నేడెంతసుదినము''! అనె సీత
ఆ ఎలనాగ క్షణములో హఠాత్తుగ తన
సమ్ముఖమున; నీలమేఘశ్యామ సుందరుడు
నిలచిన ఆ వీరుని గాంచె; మది భావించె-
'' శ్యామల ధాత్రి పంపెనా తనపుత్రునిటకు!

83. లేక కామ రూపియైన మొయిలు,
దివి నుండి భువి దిగి వచ్చెనా?
ఒక అపూర్వజ్యోతి పగిది అతని
రూపము చాటె, జీవన గంభీరతను!
నీల మేఘశ్యాముని చరణాంబుజములపై
నతమస్తకుడైన. సౌమిత్రి ఆ రమణిగనె,
దాశరథి అనుంగు సోదరు హత్తుకున్న తీరు
హరి బ్రహ్మను ఎదకదుముకున్నట్లు తోచె!

84. అయోనిజ '' నాథా! వీక్షింపుము! ఇది
అపూర్వ అమూల్యావకాశము;
మీ అనుంగు అనుజు, తపము గని,
ఇంద్రుడంతటివాడు ఈసుజెందె!
ఇతని తపము నెదుట, ఇంద్రాసనము
కూడ సాటిరాదను విషయము, నే
నంగీకరింతు; కాని అప్సర ప్రార్థన
సైత మితడేల పెడచెవిన పెట్టెను?

85. మీరుభయుల స్వభావములు పరికింప,
స్థిరములై, శ్రేష్ఠములై గోచరించె,
కాకున్నచో, గృహమున కరుదెంచిన
సిరికి మోకాలొడ్డు వారుందురే ?
హస్తమున, స్వయంవర సుమహారము,
వాడిపోవుచుండగా, ధరించగా
నిచ్చలేక మరిది పరమయోగివలె
కంఠము మాత్రము ప్రక్కకు మరల్చె'' అనె.

86. ముందు దరహాసము చేసె దాశరథి
పిదప తమ్ముని వీక్షించె; నొక క్షణము
ఆదరమున నాలలనను క్రీగంటచూచె;
''సుందరీ! నీవెవ్వరవు ? నీకేమికావలె?
ముదమారగ వివరించుమని'' మృదువుగ
పరంధాముడు, పంచమ స్వరాన పలికె-
అంత నాఇంతి హృదయ ముప్పొంగగా
సోదర ద్వయము గని మది భావించె
'' చందనము చందనమె, కుంకుమ కుంకుమయేనని''

87. ఆ కోమలి-
'' కళ్యాణీ! నీకేమి కావలె ? నని
మీరడిగితిరి కదా!'' మీ దంత,
అధరముల ముందు ముత్యములు
పగడములు దిగతుడుపే కదా'' అనె
'చల్లకు వచ్చి ముంత దాచిన ఏమి ఫలము ?'
వరమాల చేపట్టి వరించవచ్చితి నేను;
నాయుల్ల మందలి కోర్కె వెల్లడియాయె
తెలుపుటకిక ఏమి మిగిలినదని'' పలికె.

88. వివరించిన విషయము మరల
తెలుప, నాకేల సంకోచము!
నా భవిష్య జీవనముపై,
సైతము లేదు నాకాలోచన;
పయోముఖ విషకుంభము రీతి మదిలో
నొకటి వాక్కున మరొకటి పలుకు దానను
కాను; నాలో కలవు అమోఘ శక్తులు
నేనెరుగను కపటోపాయఘాతకములు.

89. ఎల్లవేళలందు నేను నాపై
కలిగియుందును, సర్వహక్కులను;
తలచిన కడకేగుదును; స్వేచ్ఛగా
విలసితముగ, విహరించుచుందును.
భీతిలేని దానను నేను నాకేల
'చింత' కాలమును గూర్చి ? 'వింతలలో
వింత' నేను వెరచుటకు; నన్ను చూచి
వెరచు వెతలు; వాటి భయము నాకేటికి ?

90. సగము రాతిరి గడచినంత,
ఏకాంతముగ నీవనమున,
విచరింతమను వాంఛ మదిని
జనించె; బయలుదేరి వచ్చితి
ఇటుకు రాగానే, స్వచ్ఛశిలపై,
ఆసీనుడైన నీసుందరుగంటి;
కదలక – మెదలక, విగ్రహామువలె
ఊహల కడలిలో మునిగియుండె.

91. వాస్తవము పలుకుమని సత్యము
ప్రేరణ సేయ భాషించు చుంటి,
ఇతనిని కాంచగనే వశము తప్పె
మది; సకల మర్పింప సంకల్పించితి
అమరు లెవరికిగాని నాయుల్లము
ఏమరియైన వంగదయ్యె; ఎట్టి
ప్రలోభములైన, రాగరుచులైన,
నన్ను మభ్య పెట్టలేదింతవరకు!

92. చాటుగా చూచి, ఇతనికై మాటున
నిలచి; చాలతడవు, వేచియుంటి-
అతనుని బాణబాధల కోర్చుచూ,
పిదప కోరికల విరులు హారముగ
కూర్చి తెచ్చి, ఎదుట నిలువబడితి.
ఈ మిషతో నా ఈప్సితము ఈ డేరు
నని భావించి, కొండంత ఆశతో
గుండెను దోసిటగొని వడిగా వచ్చితి.

93. కాని ఇతడు మాత్రమడిగనులే
'నీవెవ్వరని' నీవడిగినట్లు
'ఏమికావలెనని' అడుగడయ్యె
మీరడిగిన రీతి, ప్రేమతోడ;
ఉభయులు, పరిశుద్ధులైనను సరే,
లేక అపరిశుద్ధులైనను సరే,
సదా పెద్దలు మాన్యులుగ వుందురు;
పిన్నలు ఎపుడూ సామాన్యులుగనే!

94. భళా! మీరు హాస్యమాడిన ఆడెదరుగాక!
ఒక వేళ నన్నుపహసింతురు గాక; ఈ వేళ,
నాకు మీపై గల్గెసంపూర్ణ విశ్వాసము;
సర్వవేళలందు, స్వబుద్ధియే హితము గూర్చు
ఆర్యులైనందున ఆలకింపుడు
మీరెంతటి వీరులో, అంతటి కార్య
దక్షులు; కలవు మీలో రాగసుధలు
ఒకింత కలదు కాఠిన్యము గూడ.

95. నీవే ధరింప రారాదా! జయమాల
వంటి ఈ వరమాలను ఓ అతిలోక
సుందరా! ఈ పర్ణకుటీరము క్షణములో
ప్రత్యక్షమగును నీప్రాసాదముగా !
నన్ను గ్రహించిన ఈ సుందరి, కినుకను నీవు
మరువగలవు; అనుభవించగలవు సుఖభోగ
ముల నన్ను గూడి; నిరంతరము హేమకూట
కైలాసమాదిగా గల గిరులయందు సఖా''!

96. మిథిలేశపుత్రి గంభీర వదనయై '' నీ వెం
తకైన తగుదువు, ముందు తోడికోడలంటివి-
పిదప 'సవతి' ననుచు ఇంట నిప్పుపెట్టితివి
హద్దు మీరికోరవు కదా నా మరణంబునైన.
ప్రతి నిత్యము కలుగనిచ్చిన చాలు నాకు,
పతి దర్శనంబు అనుచుశాంత చిత్తయై
'దీనినే కదా వ్రేలును చూపి చేతిని
మ్రింగుట అందురు'' అనియె అయోనిజ.

97. '' పరుష వాక్యములను విడనాడుము,
పరుల వివాదములందు తల్లీ!
ప్రవేశించుటెంత మాత్రము తగదని''
పలికె మైత్రితో సౌమిత్రి వదినెతో
'' అరుదెంచితివి న్యాయము సలుపగ
మరి ఏల వ్యామోహమున పడెదవు ?
ఇతరుల తగాదాలలో తలదూర్చిన
నీవారినే వదలవలసి వచ్చునని రెట్టించె''.

98. ''సుకృతము భాషించకనే నీ వాణి,
ఆకృతి వలన ఓ కళ్యాణీ! నీ
ప్రకృతి వెల్లడి యయ్యె; నీలో ఎన్నో,
వికృతమైన అవగుణములగుపడుచున్నవి,
నాపలుకు లోకింత ఆలకింపుము
ఇల్లు-వాకిలి వదిలి వచ్చినను
ఇల్లాలితో వసించుచుంటినని''
పలికె పరంథాముడా పడతితో

99. ''గృహస్థుడయ్యు, నా సోదరుడు
గృహము వీడి, బ్రహ్మచర్యము
దాల్చె; తమ్ములకు తల్లులకును
దూరమై మాతో కానలకు వచ్చె
నీవు సైతము ఎరిగితి వితడు
ఒంటరియని; చేపట్టదలచి
నీ అనురాగమును మొదటనే
ఇచ్చితివి కదా ధన్యురాలివై.

100. మున్నుకొందరు కన్యకామణులు తమ
అనురాగ నయగారములతో, వలచి,
వలపించుకొని, అపరనిష్ఠా గరిష్ఠుల
చేపట్టి, చిరకీర్తి బడసిరి విశ్వమందు
వారివలె నీవును, ఇతని నీ చెలికాని
గా చేసికొనినచో, ఘనతరమ్మైన
నీ గుణగణములు ప్రశంశలనందుకొని
నీ కీర్తి వ్యాప్తి చెంది వాసిగాంచు.

101. ప్రజ్ఞావంతులుగ, పేరుబడసిరి
అంధులు అఖిల విశ్వమునందు,
ప్రేమాంధులు, చరాచరము నందు,
సకలము విస్మరించి వర్తింతురు.
ప్రేమ గుడ్డిది కాన నీవితని నీవశము,
గావించుకొన్న 'ప్రేమాంధతతో; నిన్ను
నేనవహేళన చేయను; నిండు మనసుతో
పరమ ధన్యవైతివని నే ప్రస్తుతింతు''.

102. ఆ సింహగర్జని వీక్షించెను-
నిగూఢముగా సౌమిత్రి నపుడు;
అధరములపైన తర్జనిని
తొలగించి అతడిట్లు పలికె-
'' నిలువు మక్కడ బాలా! నీవిపుడు నాకు
మాన్యురాలివి సుమా; మాటాడవలదు
అన్నయందను రక్తవైతివి; కావున నీవు
పరమ పూజ్యురాలివైన తల్లివైతివి.''

103. నీ విరువైపుల ఆసక్తురాల
వైతివేని ముందు అనుజపత్నివి
ఐతి వనియె రాఘవుడామెను గాంచి-
ఒకరి తదుపరి మరొకరి మాటలు
ఝుంఝూ మారుత, ప్రవాహములకు
అటునిటు కొట్టుకొను నావపగిది
ఆ అతివ లోనయ్యె విచిత్ర
దశకు అతిచింతాక్రాంతయ్యె

104. అంత నామె క్రోధావేశములు
ముప్పిరి గొన, " ఎంచి పెంచుకున్న
బంధములు 'త్రెంచుకొని పోగలనే?
ఒక్కవిషయము మీరెరుగ వలయు
కనివిని ఎరుగని లోకాతీత శక్తులు
కలవు నాలో, వాని ప్రభావమున మీకు
నాపై గాఢాను రక్తి గలిగి తీరు, మీరే
నాదరి జేరెదరని నొక్కి చెప్పె ధృడముగ.

105. నాకడగంటి చూపునెదుట ఇంచుకైన
నిలువజాలవు మీధనుర్బాణములు ;
అని పలికె నాకామిని క్రోధముతో
రఘుకుల తిలకుడపుడు " నీ ఘనత
ఎట్టిదైనను మానవస్వభావతీరు
తెన్నులు అటులనే యుండు నెపుడు
ప్రేమ జనించు పరవశత్వము వలన
కాని, భీతి వలన ప్రీతి కలుగ బోదు".

106. ప్రభువు పైమాటలని వహించె మౌనము
కొంత తడవాగి గంభీరుడయ్యెను
కాని లక్ష్మణుడు కోపోద్రిక్తుడై
యుద్ధ సన్నద్ధుడై శూరవీరునివలె-
"నీవు అబలవయ్యును వీరవనిత
వలె అహంభావివై వదరితివి నీవీ
విషయము మరువ వలదు మాపౌరుషము
యెట్టిదో ఎరుగని అజ్ఞానివైతివనె"

107. సవరించని వీణతంత్రుల
విషమధ్వనివలె ఆస్వేచ్ఛా
విహారిణి హుంకరించె – "నిరతము
అబలలు అబలలేనా అయ్యో!
'నీవెరుగవేమో, తమ ప్రేమ విఫల
మై, అవమానితులైన అబలలు,
ప్రబలలై, ప్రభంజనము వలె క్రోధ
ముతో, విజృంభింతురు నాగకన్యలై"!

108. నిశ్చల ప్రేమ నిరాటంకమై
చెరగక సాగుచుండు నిరంతరము
అనురాగ మంతకంతకు వృద్ధిచెందు
కామినుల తోటి విరోధమంత కన్న
బలవత్తరమైనదని గ్రహించవలె
మా క్రోధము భామినుల వైరము
కన్న అధిక భయంకరమైనరూపు
దాల్చునని పలికె ఆ మాయావిని.

109. నేనెంత రూపవతినో అంతభీకరిని
నాలో సంపూర్ణముగ దానవత్వమున్నది
ఎంత కోమలముగ పైకి కనిపింతునో
అంతరంగమందు వుందునతి కఠినముగ
అందరు అచ్చెరువంది చూచు
చుండ వారి యెదుట తటాలున
ఆ రమ్య రూపము క్షణములో
అతి భయంకరమై నిలిచె

110. మలయ మారుతము ఝంఝూనిలమై,
విలయతాండవము చేయుట; గోధూళి
వేళా నంతరము చిమ్మ చీకట్లు
క్రమ్ముకొని వికట రూపము దాల్చుట!
సుందర సుమములు, విషపూరితమైన
కీటకపు స్పర్శతో నశించుటను; ఎల్లరు
చూచియుందురు గాని, గాంచియుండరు
ఈ హఠాత్పరిణామ మెవ్వరెపుడును!

111. కోమలమైన, కపోలములు తటాలున
కందురీగల మట్టి గూళ్ళవలె మారె;
వేడినిట్టూర్పులు విడుచుచు, అధరములు
చింపిరి పేలికలవలె, అదరసాగెను,
కలువ మొగ్గల బోలు దంతములు,
వరాహపు కోరలుగ మారగా;
రౌద్రరసము భీకర వికృతరూపమై
పెనువరద వలె గట్లు దాటి విజృంభించె!

112. జిలుగు పీతాంబరమ్ములకు బదులుగా
తనువున చర్మాంబరములు గోచరించె
నవరత్నఖచిత ఆభరణములు, శల్య
హారముల పేరులుగ మారిపోయెనుగా!
భుజములపై వ్రేలాడు బారైన
కుంతలములు ప్రేగుల పోగులయ్యె
పుష్పముల వరమాల సయితము
పుర్రెల హారముగ మారెను గదా!

113. ఆమె విశాలకాయమునకు తగిన
సఖుడు మహోన్నత వటవృక్షమే
నఖముల లక్షణములు చూడవిదిత
మాయెను దానవి 'శూర్పణఖ' యని
భయ సంభ్రమాశ్చర్యములు ముప్పిరిగొన
మ్రాన్పడి పోయె మానిని జానకి ఆ
మాయావి గాంచి; నిశ్చల విగ్రహము వోలె
నుండి పిదప గద్గద స్వరముతో నోరువిప్పె.

114. సోదరులుభయులు వీక్షించుకొనిరి,
ఒకరి మొగము లొకరు ఒకింతసేపు,
జానకీ రమణుడు తన అర్ధాంగిని
ఆ స్త్రీతో భాషింపకుమని సైగచేసె
సౌమిత్రియు, వదినె నభ్యంతరపరచె
సుందరరాముని మందస్మితవదనము
గాంచి వైదేహి ఊరడిల్లె; చుప్పనాతి
శూర్పణఖ యని ఎరిగి ఆమెతో లక్ష్మణుండు-

115. '' మాయావినీ! నీ రూపలావణ్య
పరిణామ మిదియేనా ? లోకములో
జనులందరి కంట దుమ్ముకొట్టుట
యేనా నీ పని ? నీకు తగిన శాస్తి చేసెద
కాని నీ సహజ వికార స్వరూపము
తో; వెరపింప జాలవు మమ్ముల;
నీ వోడింపలే వెన్నటికని ఎరుగుము
నీరాక్షసత్వము జయము సాధించదని'' పలికె.

116. మేడిపండు వలె బాహ్య సౌందర్య మెంత
మేలిమై యుండునో, లోపలంత వికార
ముగనుండునా! యేది ఏమైన గాని నేను గూడ
నీకపటోపాయమునే అనుసరింతుగాక!
సంహరింతమన్న నీవబలవైతివి
నీ వెవరినీ ఇకపై వంచించని రీతి,
నిన్నెవరు గురుతెరుగని తెరగు
గావింతు గాక; నీకంగవైకల్యము''!

117. తక్షణమే తళతళ మెరియు కరవాలముగొని
లక్ష్మణుడు కలియబడు నామాయావిని
ముక్కు చెవులు పరపరకోసివేసెను కాని
జాలిగొని తీయలేదా పాపి ప్రాణముల
భీకరమై వికార స్వరూపియై ఆమె
రుధిర ధారల కార్చుచూ, విలవిలలాడుచు
దూషించుచు దుమ్మెత్తి పోయుచు
పిక్కబలము చూపె లబలబ మొత్తుకొనుచు.

118. ఆ దానవి భీకర హాహాకారము
లతో, దిక్కులు పిక్కటిల్లె; అంతట
భయాందోళన భావము లావరింపగా;
విదేహనందిని విచారమగ్నయయ్యె.
యెదఏదో కీడు శంకించసాగెను,
మది కలవరపడె భయాందోళనతో
విధిని తప్పింప ఏరివశము ? తుదకు
బంగారులంక మట్టి పాలవబోవుచుండ!

119. " కుడికన్నదిరె దుశ్శకునములు తోచె వేకువనే,
కీడేదో మూడునని ఆమె ఎడద హెచ్చరించె!
విధిని ప్రార్థించె 'ఎల్లరకు శుభము గల్గుచేయు
మనుచు'', విదేహనందిని పెద్ద నిట్టూర్పువిడిచి-
" నీవు సంశయము వీడుము తల్లీ!
ఈ అనుచరుడు అండగా నుండగా
భయము చెందెదవేల ? తెలుపు'' మనుచు
సౌమిత్రి సీతకు అభయమిచ్చె.

120. కోరి ఆహ్వానింతురా ఎవరైనా,
అలవిగాని ఆపదల నెపుడైనా,
విధివక్రించి వాటిల్లుచో విపత్తులు,
ఎదుర్కొనవలె వెరువక ధైర్యముతో.
భావింతు నేను విఘ్నబాధల,
జన్మాంతర కర్మఫలమ్ములని!
శిక్షాదీక్షలందనుభవ శూన్యులు,
వెరతురు భయ సంకోచములతో.

121. 'కష్టములెపుడు కాలాధీనములు!
ఇది తథ్యమని' ఇనకుల దీపకుడనె.
పొంగనేల గర్వితులై, సుఖములలో?
కుంగనేల దుఃఖములో ? యని ప్రశ్నించె-
ఆపదలు వాటంతటవి
రానంతవరకు వెరచిన,
వెతలాసన్నములైన తఱి;
ఢీకొనవలె రణధీరతతో.

122. " విపత్తులు వాటిల్లినపుడు మిమ్ము రక్షింతు,
ఇష్టముగ నేనను భవింతు కష్టముల;
నాకు సైతము కోర్కె కలదు, చిక్కనైన
చిక్కులతో చిక్కి చేరి చెలగాటమాడ.
బాధలెన్నింటిని భరించుశక్తి
గలదో, నాకు చూచెదగాక!
నాకెంత ఓరిమిగలదో, అదినేనే
పరీక్షించుకొనెదగాక''! అనె సౌమిత్రి

123. " ఇన్ని ఇక్కట్లు కలవని నేనెరుగనైతి
ఇకనేమి మిగిలియున్నది సహించుటకు నా
కొఱకెంతటి ఓరిమి చూపితివి సోదరా!
నీ అంత సహనశీలి భువినెవరనె'' ? రాఘవుడు
" ఆర్యా! నీ సేవకుడు సౌమిత్రి
సహించ గలడెంత విపత్తునైన
కాని నీ మాటలు నన్ను చేయుచున్న
వే ఓరిమి లేనివానిగా'' ననెను.

124. ‘‘ చాలింపుము! నీ ప్రలాపములు!
పలుకకు అపశకునములనెపుడు
ఆపదలను రావలెనని, కోరుకొనకుము
ఎపుడును’’ అని లక్ష్మణునితో సీత పలికె
ఎప్పుడును అభిలషించలేదు వైభవముల
ఇప్పుడెవరికి కలగబోదు అసూయ మనపై
ఒప్పుగనున్న మన జీవనస్రవంతికీ సుఖముచాలు
ఎప్పటికీ ఇది నిండు ప్రవాహమై సాగుగాక’’!

125. వదలలేదా, మనము రాజ్యమును; నిధులన్ని
కాలదన్ని కదలలేదా కారడవులకు ?
విధి మన ఈ సౌఖ్యములను పొందుట కూడ
సహింపజాలదా ? వివరింపు’’మనె వైదేహి
‘‘ విధి సంగతి వృద్ధులనడిగిన
విదితముగ తెలుపగలరు వివరణ
తోడ; సదా పురుషార్థ పక్షపాతి
నేనని వృద్ధులెరుగుదురు లే’’ అనుచు

126. ఊర్మిళా విభుడుల్లాసముగ హసించె నంత;
సీతా మనోహరుడు స్మిత వదనుడు కాగా,
విదేహనందన వినోద భరితముగ నవ్వె
అందంతట ఆనందము చిందు వేసెనపుడు
‘వివరించతుగునే పురుషార్థమును గూర్చి
నీవు సతిని వెంట తోడ్కొని రాకుండగనే ?
అని పలుకుచున్న అయోనిజ అక్షులందు
నిండె అనురాగ భరితానంద బాష్పములు.

127. “ కడవగైకొని నదికి తరలుము; సౌమిత్రి
ఈ తడవకు క్షమించుము పురుషార్థమును;
వడిగాచని మత్స్యముల పట్టుము;
ఒడినిండ గింజల తెచ్చెదనని” సీత.
జలపాత్రతో నిలువబడె సౌమిత్రి
వదినె ఆజ్ఞకు తక్షణమే విధేయుడై,
వారిరువుర అప్రమత్తత గని
రఘు వీరుడు రంజిల్లె రాగముప్పొంగ॥

128. చూడ, చూడ మీ వదినామరదుల మైత్రి
ముచ్చటాయె నాకు ఎంచిచూడ; మిమ్ముల
నావారిగ పొంది పొంగి పోయితిని;
నామది కెంతో శాంతి చేకూర, నను
సుదతి సీతతో, అనుజుతో పలికె దాశరథి
అంత లక్ష్మణుండు పులకితుడై పునీతులు;
ఆదర్శ దంపతులును ఐనసీతారాములపై
ప్రేమతో నవవికసిత కుసుమజల్లులు కురిపించె.

